శ్రీరస్తు.

శ్రీకృష్ణచరణసేవాసమాసాదితసరసకవితా చాతురీధురీణుండగు-

శ్రీ జయదేవకవివర్యునిచే-

రచియింపంబడిన-

గీతగోవిందకావ్యమను పేరుగల-

# అష్టపదియనుగ్రంధము.

ఇది.

ప్రతిపాదితశ్రీకృష్ణలీలావిశేషంబగుటంజేసి

ప్రతిపదటీకాసహితంబుగ

పండితపరిష్కృతంబుగావించి.



సరస్వతి- తిరువేంగడాచార్యులవారిచేతను-

పిల్లారిసెట్టి- రాఘవయ్యనాయనివారిచేతను-

స్వకీయములైన.

సరస్వతీనిలయముద్రాక్షరశాలయందును.

శ్రీభారతీనిలయముద్రాక్షరశాలయందును-

ముద్రింపించి ప్రకటింపఁబడియె.



౧౮౭౭సం

MADRAS.



శ్రీరస్తు.



గీతగోవిందేమహాకావ్యే - ప్రథమస్సర్గప్రారంభః.

శ్లో॥ మేఘైర్మేదురమంబరంవనభువః శ్యామాస్తమాలద్రుమై । ర్నక్తం భీరురయంత్వమేవతదిమంరాధే గృహంప్రాపయ । ఇత్థంనందనిదేశతశ్చలిత యోః ప్రత్యధ్వకుంజద్రుమం । రాధామాధవయోర్జయంతియమునా కూలేర హఃకేళయః ॥ ౧ ॥ వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మాపద్మావతీచరణ చార ణచక్రవర్తీ । శ్రీవాసుదేవరతికేళికథాసమేత మేతంకరోతి జయదేవకవిఃప్ర బంధం ॥ ౨ ॥ యదిహరిస్మరణేసరసంమనోయదివిలాస కథాసుకుతూహలం।

---

టీక॥ హేరాధే-ఓరాధా- అంబరం-ఆకాశము- మేఘైః-మేఘములచేత-మేదు రం - దట్టమైయున్నది- వనభువః- వనభూములు- తమాలద్రుమైః- కానుగుచెట్లచేత- శ్యామాః-నల్లనైయున్నవి-అయం-ఈశ్రీకృష్ణుడు - నక్తం-రాత్రియందు-భీరుః-భయపడు వాడు- తత్ - ఆకారణమువలన-త్వమేవ- నీవే- ఇమం-ఈకృష్ణుని-గృహం-గృహమును- ప్రాపయ-పొందించుము- ఇత్థం-ఈప్రకారముగా - నందనిదేశతః - నంద-నందునియొ క్క-నిదేశతః-ఆజ్ఞవలన-చలితయోః-పోవుచున్న-రాధామాధవయోః-రాధాశ్రీకృష్ణు లకు-ప్రత్యధ్వకుంజద్రుమం-ప్రత్యధ్వ-ప్రతిమార్గమందుగల - కుంజ-పొదరిండ్లయందును- ద్రుమం-వృక్షములక్రిందను-రహఃకేళయః - రహః-ఏకాంతమందు-కేళయః-క్రీడలు-య మునాకూలే - యమునానదీతీరమందు - జయంతి - సర్వోత్కర్షములుగా నున్నవి॥ ౧॥టీ॥ వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మా-వాగ్దేవతా- సరస్వతీదేవియొక్క-చరిత-చరి త్రములచేత-చిత్రిత-అలంకరింపబడిన-చిత్త - హృదయమనెడి-సద్మా - గృహముగలిగినట్టి న్ని - పద్మావతీచరణచారణచక్రవర్తీ - పద్మావతీ - పద్మావతియనెడి ప్రియురాలియొ క్క-చరణ-పాదములయొక్క-చారణ-నాట్యమాడించుటయందు-చక్రవర్తీ-సమర్థుడై న-జయదేవకవిః-జయదేవుడనెడుకవీశ్వరుండు-శ్రీవాసుదేవరతికేళికథాసమేతం-శ్రీవా సుదేవ-శ్రీకృష్ణస్వామియొక్క-రతికేళి- సురతక్రీడలయొక్క-కథా - కథలతోడ-సమే తం-కూడియున్న-ఏతంప్రబంధం-ఈప్రబంధమును-కరోతి-చేయుచున్నాడు॥౨॥టీ॥ హ రిస్మరణే-శ్రీకృష్ణస్మరణయందు-మనః-మనస్సు-సరసంయది-భక్తిరసముతో గూడినదాయె నా-విలాసకథాసు-శృంగారకథలయందు- కుతూహలంయది - సంతోషమైనదా-యెనా

మధురకోమలకాంతపదావళింశృణుతదాజయదేవసరస్వతీం ॥ ౪॥ వాచఃపల్లవయత్యుమాపతి ధరస్సందర్భశుద్ధింగిరాం । జానీతేజయదేవఏవశరణః శ్లాఘ్యో దురూహద్రుతే । శృంగారోత్తరసత్ప్రమేయరచనైరాచార్య గోవర్ధనః స్పర్ధీకోపినవిశ్రుతః శ్రుతిధరోదోయీకవిక్ష్మాపతిః॥శ్లో॥నితంబినీచుంబితవక్త్రబింబః శుకద్యుతిఃకుండలవాన్ ప్రశస్తః । సంగతశాలామవిశత్ప్రదోషేమాలాధరోమాళవరాగరాజః॥

---

తదా - అప్పుడు - మధురకోమలకాంతపదావళిం-మధుర-శ్రావ్యములైన-కోమల-మృదువులైన-కాంత-రమణీయములైన-పద - పదములయొక్క-ఆవళిం - పఙ్క్తిగలిగిన-జయదేవసరస్వతీం - జయదేవ-జయదేవకవియొక్క-సరస్వతీం- గానరూపమైనవాక్కును-శృణు - వినుము॥౪॥టీ॥ఉమాపతిధరః-ఉమాపతిధరుడనెడికవీశ్వరుడు-వాచఃవాక్కులను-పల్లవయతి-మృదువులుగాబలుకుచున్నాడు-శరణః - శరణమిశ్రుడనుకవీశ్వరుడు-దురూహద్రుతె-దురూహ-ఊహింపశక్యమైన - ద్రుతె - శీఘ్రోచ్చారణవిషయమై-శ్లాఘ్యఃకొనియాడదగినవాడు (అనగాఆశుకవియనుట)ఆచార్యగోవర్ధనః - ఈజయదేవకవికిగురువైనగోవర్ధనాచార్యుడు - శృంగారోత్తరసత్ప్రమేయరచనైః - శృంగార-శృంగారరసమే - ఉత్తర - ప్రధానముగాగలిగిన - సత్ - విద్వాంసులచేత-ప్రమేయ-తెలియదగిన- రచనైః - కల్పనలచేత - శ్లాఘ్యః - కొనియాడదగినవాడు - దోయీకవిక్ష్మాపతిః - దోయీనామకకవిశ్రేష్ఠుడు- శ్రుతిధరః - వినినమాత్రముచేతనేగ్రహించెడివాడు- జయదేవఏవ - జయదేవకవీశ్వరుడే-సందర్భశుద్ధిం-సందర్భ - రచనావిశేషములయొక్క-శుద్ధిం - సర్వగుణసంపత్తిని - జానీతె-ఎఱుగును-అస్య- ఈజయదేవకవికి-స్పర్ధీ- శత్రువైనవాడు-కోపి- ఒకానొకడైనను -నవిశ్రుతః-ప్రసిద్ధుడైనవాడుకాడు॥౫॥ టీక ॥ నితంబినీచుంబితవక్త్రబింబః ॥ నితంబినీ - పద్మినీజాతిస్త్రీచేత - చుంబిత - ఆస్వాదింపబడిన- వక్త్రబింబః-అధరబింబముగలిగినట్టియు - శుకద్యుతిః-శుక-చిలుకయొక్క-ద్యుతిః-కాంతివంటికాంతిగలిగినట్టియు - కుండలవాన్- కర్ణకుండలధరుడైనట్టియు-ప్రశస్తః-ప్రసిద్ధుడైనట్టియు-మాలాధరః- మౌక్తికహారమునుధరించినట్టి - మాళవరాగరాజః- మాళవరాగమనెడిరాజు- ప్రదోషే-ప్రదోషకాలమందు- సంగీతశాలాం-సంగీతసభను-అవిశత్-ప్రవేశించెను-(అనునీశ్లోకోక్తప్రకారముగాసకలరాగములకునుమాళవరాగమురాజైనందువలనను పురుషరాగమైనందువలనను-మాళవరాగేణగీయతే-అనిఅష్టపదులకుమొదటనేప్రయోగింపబడియె॥)

## అష్టపదీప్రారంభః, శ్రీభగవద్దశావతారవర్ణనం.

౧॥ మాళవరాగేణగీయతే॥ ప్రళయపయోధిజలే - ధృతవానసివేదం - విహితవహిత్రచరిత్రమఖేదం - కేశవాధృతమీనశరీర - జయజగదీశహరే॥౨॥ క్షితిరతివిపులతరే-తవతిష్ఠతిపృష్ఠే- ధరణీధరణకిణచక్రగరిష్ఠే - కేశవాధృతకచ్ఛపరూప-జయజగదీశహరే ॥ ౩ ॥ వసతిదశనశిఖరే-ధరణీతవలగ్నా- శశినికళంకకళేవనిమగ్నా - కేశవాధృతసూకరరూప - జయజగదీశహరే ॥ ౪ ॥ తవకరకమలవరే - నఖమద్భుతశృంగం-దళితహిరణ్యకశిపుతనుభృంగం- కేశవాధృతనరహరిరూప - జయజగదీశహరే ॥ ౫ ॥ ఛలయసివిక్రమణే - బలిమద్భుతవామ

---

### మొదటియష్టపదీటీక.

౧॥ టీ॥ ధృతమీనశరీర॥ ధృత-ధరింపబడిన-మీన-మత్స్యముయొక్క - శరీర-దేహము వంటిదేహముగలిగిన-హేకేశవ-ఓశ్రీకృష్ణస్వామీ-ప్రళయపయోధిజలే-ప్రళయ- మహాప్రళయమునందు-పయోధి-సముద్రముయొక్క- జలే-ఉదకమునందు - విహితవహిత్రచరిత్రం-విహిత-చేయబడిన-వహిత్ర-ఓడయొక్క- చరిత్రం-చారిత్రముగలిగిన-వేదం-వేదమును-అఖేదం-ఆయాసములేనట్టుగా-ధృతవాన్- ధరించినవాడవు-అసి-అవుచున్నావు- జగదీశ-జగత్-జగత్తుకు-ఈశ - స్వామివైనట్టి-హేహరే-ఓశ్రీకృష్ణస్వామీ - జయ-సర్వోత్కృష్టుడవుగమ్ము॥౨॥ టీ॥ ధృతకచ్ఛపరూప॥ ధృత-ధరింపబడిన-కచ్ఛప- తాబేటియొక్క-రూప-ఆకారమువంటిఆకారముగలిగిన-హేకేశవ- ఓశ్రీకృష్ణస్వామీ-క్షితిః-భూమి అతివిపులతరే-మిక్కిలివిశాలమైనట్టిన్ని- ధరణీధరణచక్రగరిష్ఠే- ధరణీధరణ-మందరపర్వతమువలననైన-కిణ-కాయలనెడి-చక్ర-చక్రాకారములచేత-గరిష్ఠే- కఠినమైనట్టి-తవ-నీయొక్క-పృష్ఠే-వీపునందు-తిష్ఠతి-ఉంచున్నది ॥౩॥ టీ॥ ధృతసూకరరూప-ధృత-ధరింపబడిన-సూకరవరాహముయొక్క- రూప-ఆకారమువంటి-ఆకారముగల-హేకేశవ-ఓశ్రీకృష్ణస్వామీ- తవ-నీయొక్క-దశనశిఖరే-దంతాగ్రమునందు-లగ్నా - అంటిన-ధరణీ- భూమి-శశిని-చంద్రునియందు- నిమ్నగా-మునిగిన- కళంకకళేవ-కళంకకళవలెనే- వసతి-ఉంచున్నది ॥ ౪ ॥ టీ ॥ ధృతనరహరిరూప - ధృత- ధరింపబడిన - నరహరిరూప- నరసింహస్వరూపముగలిగిన- హేకేశవ- ఓశ్రీకృష్ణస్వామీ- తవనీయొక్క-కరకమలవరే- శ్రేష్ఠమైనకమలమువంటి హస్తమునందు-అద్భుతశృంగం - అద్భుత-ఆశ్చర్యకరమైన - శృంగం - అగ్రభాగముగలిగినట్టిన్ని - దళితహిరణ్యకశిపుతనుభృంగం- దళిత - పగల్చబడిన - హిరణ్యకశిపు - హిరణ్యకశిపునియొక్క - తను - శరీరమనెడి- భృంగం - తుమ్మెదకలిగినట్టి - నఖం - గోరు - తిష్ఠతి ఉంచున్నది॥

న - పదనఖనీరజనితజనపావన - కేశవాధృతవామనరూప - జయజగదీశహరే॥
౬॥క్షత్రియరుధిరమయే - జగదపగతపాపం-స్నపయసిశమితభవతాపం- కేశ
వాధృతభార్గవరూప-జయజగదీశహరే॥ ౭॥ వితరసిదిక్షురణే-దిక్పతికమనీయం-
దశముఖమౌళిబలింరమణీయం - కేశవాధృతరఘుపతిరూప-జయజగదీశహరే॥
౮॥వహసివపుషివిశదే-వసనంజలదాభం- హలహతిభీతిమిళితయమునాభం-కేశ
వాధృతహలధరరూప-జయజగదీశహరే॥ ౯ ॥నిందసియజ్ఞవిధే-రహహశ్రుతి

---

౫॥ టీ॥ అద్భుతవామనా॥ అద్భుత- ఆశ్చర్యకరుడవైనట్టిన్ని - వామనా-దైత్యనివారకుండ
వైనట్టిన్ని-పదనఖనీరజనితజనపావన॥ పద- పాదములయొక్క-నఖ-గోళ్లయొక్క-నీర-
ఉదకమువలన-జనిత-పుట్టింపబడిన - జనపావన-లోకపవిత్రముగలిగినట్టిన్ని - ధృతవా
మనరూప॥ ధృత-ధరింపబడిన-వామనరూప -వామనాకారముగలిగినట్టి- హేకేశవ-ఓశ్రీ
కృష్ణస్వామీ- విక్రమణే-త్రివిక్రమావతారమందు-బలిం-బలిచక్రవర్తిని- చలయసి-చలిం
పజేయుచున్నావు॥౬॥ టీక॥ ధృతభృగుపతిరూప॥ ధృత - ధరింపబడిన-భృగుపతిరూప-
పరశురామాకృతికలిగిన- హేకేశవ- ఓశ్రీకృష్ణస్వామీ- క్షత్రియరుధిరమయయే - క్షత్రి
య-రాజులయొక్క-రుధిరమయే-రక్తమయమైన-పయసి - ఉదకమునందు - అపగతపా
పం॥ అపగత-పోగొట్టబడిన-పాపం-దుష్కృతములుగలిగినట్టిన్ని- శమితభవతాపం॥ శ
మిత-శాంతిబొందింపబడిన-భవ-సంసారముయొక్క-తాపం- తాపత్రయముగలిగినట్టి-
జగత్-లోకమును-స్నపయసి-స్నానముచేయింపుచున్నావు॥ ౭॥ టీ॥ ధృతరఘుపతిరూప॥
ధృత-ధరింపబడిన-రఘుపతిరూపశ్రీరామస్వరూపముగలిగిన - హేకేశవ-ఓశ్రీకృష్ణస్వా
మీ-రణేయుద్ధమందు-దిక్షు-దశదిక్కులయందు-దిక్పతికమనీయం॥ దిక్పతి- ఇంద్రాదులచే
తను-కమనీయం-కోరదగినట్టిన్ని-రమణీయం-ఒప్పుచున్నట్టి-దశముఖమౌళిబలిం॥ దశము
ఖ-రావణాసురునియొక్క-మౌళి-శిరస్సులనెడి-బలిం-పూజను-వితరసి-ఇచ్చుచున్నావు॥
౮॥ టీ॥ ధృతహలధరరూప ॥ ధృత- ధరింపబడిన హలధరరూప- బలరామస్వరూపముగ
లిగిన- హేకేశవ- ఓశ్రీకృష్ణస్వామి- విశదే- తెల్లనైన- వపుషి-శరీరమందు-జలదాభం-
జలద- మేఘముయొక్క- అభం- కాంతివంటికాంతిగలిగినట్టిన్ని- హలహతిభీతిమిళితయ
మునాభం॥ హలహతి- నాగేటిదెబ్బవల్లనైన- భీతి- భయముతోడ- మిళిత- కూడిన- య
మునా-యమునానదియొక్క- అభం- కాంతివంటికాంతిగలిగిన- వసనం- వస్త్రమును-
వహసి- వహింపుచున్నావు॥ ౯॥ టీ॥ ధృతబుద్ధశరీర॥ ధృత-ధరింపబడిన- బుద్ధశరీర- సు
గతదేహముగలిగినట్టిన్ని- సదయహృదయ॥ సదయ- దయతోగూడినహృదయ-చిత్తము

జాతం-సదయహృదయదర్శితపశుఘాతం- కేశవాధృతబుద్ధశరీర-జయజగదీశహరే|| ౧౦|| మ్లేచ్ఛనివహనిధనే-కలయసికరవాలం-ధూమకేతుమివకిమపికరాళం-కేశవాధృతకల్కిశరీర-జయజగదీశహరే||౧౧|| శ్రీజయదేవకవే-రిదముదితముదారం-శృణుశుభదం-సుఖదంభవసారం- కేశవాధృతదశవిధరూప-జయజగదీశహరే|| ౬|| శ్లో|| వేదానుద్ధరతేజగంతిహరతేభూగోళముద్బిభ్రతేదైత్యందారయతేబలించలయతేక్షత్రక్షయంకుర్వతే।పౌలస్త్యంజయతేహలంకలయతేకారుణ్యమాతన్వతే।మ్లేచ్ఛాన్మూర్ఛయతేదశాకృతికృతేకృష్ణాయతుభ్యంనమః||

---

గలిగినట్టి- హేకేశవ-ఓశ్రీకృష్ణస్వామీ- శ్రుతిజాతం - వేదసమూహమును-యజ్ఞవిధేః-యాగకర్మములవలన-దర్శితపశుఘాతం|| దర్శిత-చూపింపబడిన-పశుఘాతం-పశుహింసగలిగినదాన్నిగాను-అహహ-కటకటాయనిన్ని-నిందసి-నిందింపుచున్నావు||౧౦ || టీ|| ధృతకల్కిశరీర|| ధృత-ధరింపబడిన-కల్కిశరీర-కలికదేహముగలిగిన-హేకేశవ- ఓకృష్ణస్వామి-మ్లేచ్ఛనివహనిధనే|| మ్లేచ్ఛ-యవనులయొక్క-నివహ-సమూహముయొక్క-నిధనే-నాశనమునందు-కరాళం-భయంకరమైన - ధూమకేతుమివ - అగ్నివలెనున్న-కరవాలం-ఖడ్గమును-కిమపి-ఒకానొకప్రకారముగా - కలయసి - పట్టుచున్నావు || ౧౧|| టీక || ధృతదశవితరూప|| ధృత-ధరింపబడిన-దశవిధ-పదివిధములైన-రూప-స్వరూపముగలిగిన-హేకేశవ-ఓశ్రీకృష్ణస్వామీ-ఉదారం- గంభీరమైనట్టిన్ని-శుభదం-మంగళప్రదమైనట్టిన్ని-సుఖదం-సుఖప్రదమైనట్టిన్ని-భవసారం|| భవ - సంసారమునందు-సారం-సారభూతమైనట్టి- శ్రీజయదేవకవేః - శ్రీజయదేవకవియొక్క- ఇదం - ఈ- ఉదితం-చెప్పబడినగీతమును- శృణు- వినుము ||౬|| టీ || వేదాన్- శ్రుతులను- ఉద్ధరతే-ఉద్ధరించినట్టిన్ని - జగంతి- లోకములను- హరతే- హరించినట్టిన్ని- భూగోళం - భూగోళమును ఉద్బిభ్రతే- భరించినట్టిన్ని- దైత్యం- రాక్షసుని- దారయతే - సంహరించినట్టిన్ని - బలిం- బలిచక్రవర్తిగాని- చలయతే- చలింపజేసినట్టిన్ని-క్షత్రక్షయం- రాజనాశమును-కుర్వతే- చేసినట్టిన్ని- పౌలస్త్యం- రావణాసురుని- జయతే- జయించినట్టిన్ని- హలం-నాగేటిని-కలయతే- పట్టినట్టిన్ని- కారుణ్యం- దయను- ఆతన్వతే-విస్తరింపజేసినట్టిన్ని-మ్లేచ్ఛాన్- యవనులను- మూర్ఛయతే-స్మారకముదప్పింపజేసినట్టిన్ని-దశాకృతికృతే- ఇత్తెఅంగునపదియాకారములగల్పించినట్టిన్ని - కృష్ణాయ - కృష్ణావతారమునుబొందియున్నట్టి-తుభ్యం- నీకొఱకు- నమః- నమస్కారము||

౧ ॥ ఘూర్జరీరాగేణగీయతే ॥ శ్రితకమలాకుచమండల - ధృతకుండలకలితలలిత వనమాలిన్ ॥ పల్లవి ॥ జయజయదేవహరే - హరే - హరేకృష్ణజయజయ దేవహరే ॥ ౨ ॥ దినమణిమండలమండన - భవఖండన - మునిజనమానసహంస-జయజయదేవహరే॥ ౩॥ కాళీయవిషధరభంజన-జనరంజన-యదుకులనళినదినేశ॥జయజయదేవహరే ॥ ౪ ॥ మధుమురనరకవినాశన-గరుడాసన-సురకులకేళినిదాన॥జయజయదేవహరే॥౫॥అమలకమలదళలోచన-భవమోచన-త్రిభువనభవననిధాన॥ జయజయదేవహ॥ ౬॥ జనకసుతాకుచభూషణ-జితదూషణ-స

---

## రెండవయష్టపదీటీక.

౧॥టీ॥శ్రితకమలాకుచమండల- శ్రిత- ఆశ్రయింపబడిన- కమలా- లక్ష్మీదేవియొక్క-కుచమండల- స్తనమండలముగలిగినట్టిన్ని-ధృతకుండల-ధరింపబడినకుండలములు గలిగినట్టిన్ని- కలితలలితవనమాలిన్- కలిత- స్వీకరింపబడిన- లలిత- సుందరమైన- వనమాలిన్- వనమాలికగలినట్టిన్ని- దేవ- ప్రకాశస్వరూపుడవైనట్టి- హేహరే- ఓశ్రీకృష్ణస్వామి- జయజయ సర్వోత్కృష్ణుడవైవర్తించుమా॥౨॥టీ॥దినమణిమండలమండన- దినమణి- సూర్యునియొక్క-మండల- బింబమువంటి- మండన- అలంకారముగలిగినట్టిన్ని- భవఖండన- భవ- సంసారఖేదమును- ఖండనభేదించినట్టిన్ని- మునిజనమానసహంస- మునిజన- ఋషిజనములయొక్క- మానస- మనస్సులనెడి- సరస్సులయందు- హంస- హంసవైనట్టిన్ని- దేవ- ప్రకాశస్వరూపుడవైనట్టి- హేహరే॥౩॥టీ॥కాళీయవిషధరభంజన- కాళీయ- కాళీయుడనెడి- విషధరసర్పమును- భంజన- మర్దించినట్టిన్ని- జనరంజన- జన- జనులకు- రంజన- సంతోషపెట్టునట్టిన్ని- యదుకులనళినదినేశ- యదుకుల- యాదవవంశమనెడి- నళిన-కమలమునకు- దినేశ-సూర్యునివలెనున్నట్టిన్ని- దేవ-హేహరే॥౪॥టీ॥ మధుమురనరకవినాశన - మధుమురనరకాసురులనశింపచేసినట్టిన్ని - గరుడాసన- గరుత్మంతుడేఆసనముగాగలిగినటిన్ని-సురకులకేళినిదాన- సురకుల-దేవకులముయొక్క- కేళి- క్రీడలకు- నిదాన- ఆదికారణభూతుడవైనట్టిన్ని- దేవ- హరే-జయజయ॥౫॥టీ॥అమలకమలదళలోచన- అమల- స్వచ్ఛమైన- కమలదళ- తామరరేకులవంటి- లోచన- కన్నులుగలిగినట్టిన్ని- భవమోచన-భవ-జన్మమరణాదిరూపసంసారమువల్లనుంచి-మోచన- విడిపించునట్టిన్ని- త్రిభువనభవననిదాన- త్రిభువన- ముల్లోకములయొక్క- భవన- ఉత్పత్తికి- నిదాన- ఆశ్రయుడవైనట్టిన్ని- దేవ-హరే- జయజయ॥౬॥టీ॥జనకసుతాకుచభూషణ- జనకసుతా-సీతాదేవియొక్క- కుచ- స్తనములకు-భూషణ- ఆభరణమైనట్టిన్ని-జితదూషణ-జిత-జయింపబడిన-దూషణ- దూషణుడనురాక్షసుడుగలిగినట్టిన్ని-

మరశమితదశకంఠ॥జయ ॥ ౭ ॥ అభినవజలధరసుందర - ధృతమందర శ్రీముఖ చంద్రచకోర ॥ జయ ॥ ౮ ॥ శ్రీజయదేవకవేరిదం - కురుతేముద - ముజ్జ్వల మంగళగీతం ॥ జయజయదేవహరే ॥ శ్లో ॥ పద్మాపయోధరతటీపరిరంభలగ్న కాశ్మీరముద్రితమురోమధుసూదనస్య। వ్యక్తానురాగమివ ఖేలదనంగఖేదస్వేదాంబుపూరమనుపూరయతుశ్రియంవః ॥ ౭ ॥ శ్లో॥వసంతేవాసంతీకుసుమసుకుమారైరవయవైర్భ్రమంతీంకాంతారే బహువిహితకృష్ణానుసరణాం। అమందంక

---

సమరశమితదశకంఠ- సమర- యుద్ధమునందు- శమిత- అణచబడినదశకంఠ- రావణాసురుడుగలిగినట్టిస్ని- దేవ- హరే- జయజయ॥౭॥టీ॥అభినవజలధరసుందర- అభినవ- నూతనమైన- జలధర- మేఘమువలె- సుందర-సుందరుడవైనట్టిస్ని- ధృతమందర-ధృత- ధరింపబడిన- మందర- మందరపర్వతముగలిగినట్టిస్ని- శ్రీముఖచంద్రచకోర- శ్రీ- లక్ష్మీదేవియొక్క- ముఖచంద్ర- ముఖమనెడిచంద్రునకు- చకోర- చకోరపక్షివలెనున్నట్టిస్ని- దేవ- హరే- జయజయ॥౮॥టీ॥శ్రీజయదేవకవేః- శ్రీమజ్జయదేవకవియొక్క- ఇదం-ఈ- ఉజ్జ్వలమంగళగీతం-ఉజ్జ్వల-ప్రకాశింపుచున్నట్టిస్ని- మంగళ-శుభప్రదమైనట్టిస్ని-గీతం- గానము- ముదం-సంతోషమును-కురుతే-చేయుచున్నది-దేవ-హరే- జయజయ॥౯॥టీ॥ పద్మాపయోధరతటీపరిరంభలగ్నకాశ్మీరముద్రితం-పద్మా-లక్ష్మీదేవియొక్క-ప్రయోధర- స్తనములనెడు- తటీ-ప్రక్కచరియలయొక్క- పరిరంభ- ఆలింగనముచేత- లగ్న- అంటిన- కాశ్మీర-కుంకుమచేత- ముద్రితం- చిహ్నితమైనదిగనుకనే- వ్యక్తారాగమివ-వక్త-ప్రకాశమునుబొందిన- అనురాగమివ- అనురాగముగలిగినదో- యనునట్లున్నట్టిస్ని- ఖేలదనంగఖేదస్వేదాంబుపూరం-ఖేలత్- క్రీడింపుచున్న - అనగ- మన్మథునివలనగలిగిన- ఖేద-శ్రమచేతనైన- స్వేదాంబు- స్వేదోదకముయొక్క- పూరం-ప్రవాహముగటిగినట్టి- మధుసూదనస్య- శ్రీకృష్ణస్వామియొక్క-ఉరః-వక్షస్తలము-వః-మీకు-శ్రియంసంపదను- అనుపూరయతు నిండింపజేయుగాక॥౧౦॥టీ॥వసంతే- వసంతఋతువునందు- వలద్బాధాం.వలత్- వృద్ధిబొందుచున్న-బాధాం.మన్మథపీడగలిగినట్టిస్ని-వాసంతీ.కుసుమసుకుమారైః.వాసంతీకుసుమ-బండి-గురిగింజపువ్వువలె-సుకుమారైః - కోమలములైనఅవయవైః-అంగలముచేత-కాంతారే- చొరగూడనియడవియందు-భ్రమంతీం- తిరుగుచున్నట్టిస్ని-అమందం-అధికమవునట్లుగా-కందర్పజ్వరజనితచింతాకులతయా-కందర్పజ్వర-మన్మథతాపముచేత-జనిత-పుట్టింపబడిన-చింతా-విచారముచేత- ఆకులతయామనోవ్యాకులముగలుగుటచేత -బహువిహితకృష్ణానుసరణాంబహు- అనేకప్రకారములుగాను- విహిత- చేయబడిన- కృష్ణ- శ్రీకృష్ణస్వామియొక్క- అనుసరణాం- వెదకుటగలిగినట్టి- రా

దర్పజ్వరనితచింతాకులతయా।వలద్బాధాంరాధాంసరసమిదమూచేసహచరీ.

తృతీయాష్టపదీ ప్రారంభః.

వసంతరాగేణగీయతే ॥ విహరతిహరిరిహసరసవసంతే - నృత్యతియువతిజనేన సమం - సఖివిరహిజనస్యదురంతే - విహరతిహరిరిహసరసవసంతే॥ ౧॥ లలిత లవంగలతాపరిశీలనకోమలమలయసమీరే - మధుకరనికరకరంబితకోకిలకూజిత కుంజకుటీరే ॥ విహరతి ॥ ౨ ॥ ఉన్మదమదనమనోరథపథికవధూజనజనితవిలాపే - అళికులసంకులకుసుమసమూహనిరాకుల వకుళకలాపే ॥ విహరతి ॥ ౩॥ మదనమహీపతికనకదండరుచికేసరకుసుమవికాసే - మిళితశిలీముఖపాటలపటల

---

ధాం- రాధనుగూర్చి- ఇదం- ఈవక్ష్యమాణప్రకారముగా - సహచరీ-చెలికత్తె- సరసం- అనురాగయుక్తమగునట్లు- ఊచె- పలికెను॥

మూడవయష్టపదీటీక.

టీక॥ హేసఖీ- ఓరాధా-విరహిజనస్య-వియోగిజనమునకు-దురంతె-తరింపనశక్యమైన-ఇహ- ఈ-సరసవసంతే- సరస-రసములతోగూడినట్టి-వసంతే- వసంతఋతువునందు- హరిః- శ్రీకృష్ణస్వామి- విహరతి- క్రీడింపుచున్నాడు- యువతిజనేనసమం- స్త్రీసమూహముతోగూడ-నృత్యతి-నాట్యముచేయుచున్నాడు॥ ౧॥ టీ॥ లలిత*సమీరే- లలిత-సుందరమైన-లవంగలతా- లవంగపుతీగెలయొక్క- పరిశీలన- స్పృశించుటచేత- కోమల- శీతలమైన- మలయసమీరే- మలయమారుతముగలిగినట్టిన్ని మధుకర*కుటీరే- మధుకర-తుమ్మెదలయొక్క- నికర- సమూహముతోడ- కరంబిత- కూడుకొనియున్న- కోకిల- కోవిలలయొక్క- కూజిత- ధ్వనిగలిగిన- కుంజ- పొదలనెడి- కుటీరే- గృహముగలిగినట్టి- ఇహసరసవసంతే-హరిః-విహరతి- యువతిజనేనసమం-నృత్యతి॥ ౨॥ టీ॥ ఉన్మద*విలాపే- ఉత్- అధికమైన- మద-గర్వముగలిగిన- మదన-మన్మథునిచేతనైన- మనోరథ- కోరికెలుగలిగిన- పథిక- పయనముబోయినవారియొక్క- వధూజన- స్త్రీజనముచేత- జనిత- పుట్టింపబడిన- విలాపే- దుఃఖముగలిగినట్టిన్ని-అళి*కలాపే-అళికుల- తుమ్మెదగుంపులచేత- సంకుల - వ్యాపింపబడియున్న - కుసుమసమూహ - పుష్పసముదాయముచేత - నిరాకుల- కుల- వ్యాకులమైయున్న- వకుళ- పొగడపుచెట్లయొక్క-కలాపే- సమూహముగలిగినట్టిన్ని- సరసవసంతే- విహరతి॥ ౩॥ టీ॥ మదన*వికాసే-మదన- మన్మథుడనెడి-మహీపతి- రాజుయొక్క- కనకదండ- స్వర్ణదండముగల ఛత్రముయొక్క- రుచి- కాంతివంటి కాంతిగలిగిన- కేసరకుసుమ-నాగకేసరపుష్పములయొక్క - వికాసే- వికసనముగలిగిన

కృతస్మరతూణవిలాసే ॥ విహరతి ॥ ౪ ॥ మృగమదసౌరభరభసవశంవదనవదళమాలతమాలే - యువజనహృదయవిదారణమనసిజనఖరుచికింశుకజాలే ॥ విహరతి ॥ ౫ ॥ విగళితలజ్జితజగదవలోకనతరుణకరుణకృతహాసే - విరహినికృంతనకుంతముఖాకృతికేతకదంతురితాశే ॥ విహరతి ॥ ౬ ॥ మాధవికాపరిమళమిళితే నవమల్లికయాతిసుగంధౌ - మునిమనసామపి మోహనకారిణి తరుణాకారణబంధౌ ॥ విహరతి ॥ ౭ ॥ స్ఫురదతిముక్తలతాపరిరంభణముకుళితపులకితచూతే- బృందావనవిపినేపరిసరపరిగతయమునాజలపూతే ॥ విహరతి ॥ ౮ ॥ శ్రీజయ

---

ట్టిన్ని-మిళిత*విలాసే- మిళిత-కూడుకొనియున్న-శిలీముఖ- తుమ్మెదలనెడి బాణములుగలిగిన- పాటలకలిగొట్టు చెట్లయొక్క- పటల- సమూహముచేత- కృత- చేయబడిన- స్మర- మన్మథునియొక్క- తూణ అంబులపొదులయొక్క- విలాసే- విలాసముగలిగినట్టి- సరసవసంతే-॥ ౪ ॥ టీ॥ మృగమద*తమాలే-మృగమద-కస్తూరియొక్క-సౌరభ.పరిమళయొక్క-రభస- వేగమునకు- వశంవద-స్వాధీనమైన-నవదళ- చిగురుటాకులయొక్క- మాలపఙ్క్తులుగలిగిన- తమాలే- కానుగుచెట్టుగలిగినట్టిన్ని- యువజన- యౌవనవంతులయొక్క- హృదయ.వక్షస్థలమును- విదారణ- పగల్చునట్టి- మనసిజ.మన్మథునియొక్క- నఖ-గోళ్లయొక్క- రుచి- కాంతివంటి- కాంతిగలిగిన- కింశుక- మోదుగపువ్వుయొక్క- జాలే- సమూహముగలిగినట్టి-సరసవసంతే-విహరతి॥ ౫ ॥ టీ॥ విగళి*తహాసే-విగళిత- పోగొట్టబడిన- లజ్జిత- సిగ్గుగలిగిన- జగత్- లోకముయొక్క- అవలోకన- చూచుటవలన- తరుణ- నూతనమైన- కరుణ- కరుణపుష్పములచేత- కృత- చేయబడిన- హాసే- చిరునవ్వుగలిగినట్టిన్ని- విరహి*దంతురితాశే- విరహి- వియోగిజనులయొక్క- నికృంతన- ఛేదించుటయందు-కుంత-ఈటెయొక్క.ముఖ-కొనయొక్క- ఆకృతి- ఆకారమువంటిఆకారముగలిగిన- కేతకి- మొగలిపుష్పములచేత.దంతురిత- వ్యాపింపబడిన-ఆశే- దిక్కులుగలిగినట్టి- సరసవసంతే- విహరతి ॥ ౬ ॥ టీ॥ మాధవికాపరిమళమిళితే- మాధవికా- పుష్పించినబండిగురింజతీగెయొక్క- పరిమళ- వాసనలతోడ- మిళితే- కూడుకొన్నట్టిన్ని- నవమల్లికయా- క్రొత్తమొల్లలచేత- అతిసుగంధౌ- మిక్కిలిపరిమళింపుచున్నట్టిన్ని- మునిమనసామపి- ఋషులమనస్సులకును- మోహనకారిణి- వలపుబుట్టించునట్టిన్ని - తరుణాకారణబంధౌ- తరుణ- వయోవంతులకు- అకారణబంధౌ- నిష్కారణబంధువైనట్టి- సరసవసంతే విహరతి॥ ౭ ॥ టీ॥ స్ఫురత్*చూతే- స్ఫురత్- పుష్పించియున్న- అతిముక్తలతా-బండిగురిగింజతీగెలయొక్క- పరిరంభణ-అల్లుటచేత-ముకుళిత- ముకుళించుటయనెడి పులకిత.రోమాంచముగలిగిన- చూతే- మామిడిచెట్లుగలిగినవసంతఋతువునందు- పరిసరపూతే*పరిసర- సమీపమునందు- పరిగత- ప్రవహింపుచున్న- యమునా- యమునాన

దేవఫణితమిదముదయతిహరిచరణస్మృతిసారం - సరసవసంతసమయవనవర్ణ సమనుగతమదనవికారం ॥ విహరతి ॥ ౮ ॥ శ్లో॥దరవిదళితమల్లీవల్లిచంచత్పరాగప్రకటిత పటవాసైర్వాసయన్ కాననాని । ఇహహిదహతిచేతః కేతకీగంధబంధుః ప్రసరదసమబాణప్రాణవద్గంధవాహః॥ ౯ ॥ ఉన్మీలన్మధుగంధలుబ్ధమధుపవ్యాధూతచూతాంకురక్రీడత్కోకిలకాకలీకలకలైరుద్గీర్ణకర్ణజ్వరాః। నీయంతే పథికైః కథంకథమపిధ్యానావధానక్షణప్రాప్తప్రాణసమాసమాగమరసోల్లా

---

దియొక్క- జల- ఉదకముచేత- పూతే- పరిశుద్ధమైన- బృందావనవిపినే- బృందావనమను నడవియందు- హరిఃవిహరతి॥౮॥ టీ॥ సరస - శృంగారరసయుక్తమైన - వసంతసమయ- వసంతకాలముయొక్క- వనవర్ణనం- వనవర్ణనముగలిగినట్టిన్ని- హరిచరణస్మృతిసారం- శ్రీకృష్ణస్వామియొక్క- చరణ- పాదములయొక్క- స్మృతి- ధ్యానమునందు- సారం- శ్రేష్ఠమైనట్టిన్ని- అనుగతమదనవికారం- అనుగత- అనుసరింపబడినట్టి- మదనవికారం- నఖక్షతాదిమన్మథవికారములుగలిగినట్టిన్ని - శ్రీజయదేవకవిఫణితం - జయదేవకవిచేత చెప్పబడినట్టి- ఇదం- ఈగీతము- ఉదయతి- ప్రకాశింపుచున్నది- విరహిజనస్య. విరహిజనమునకు-దురంతే-తరింపగూడినట్టి-ఇహ-ఈ-సరసవసంతే-నవరసాలంకారయుక్తమైన- వసంతఋతువునందు- హరిః- శ్రీకృష్ణదేవుడు- విహరతి- క్రీడింపుచున్నాడు-హేసఖీ. ఓరాధా- యువతిజనేన- సమం- తరుణీజనముతోగూడను- నృత్యతి- నాట్యముచేయుచున్నాడు॥౯॥ టీ॥ కేతకీ- మొగిలిపువ్వులయొక్క- గంధ- పరిమళమునకు- బంధు- బంధువైనట్టిన్ని- దర- ఇంచుకంత- విదళిత- వికసించిన- మల్లీవల్లీ- మల్లె- తీగెలయొక్క- చంచత్- ఒప్పుచున్న- పరాగ- పుప్పొడిచేతను- ప్రకటిత- ప్రకాశింపబడిన- పటవాసైః- పరిమళద్రవ్యములచేనుత-కాననాని-వనములను- వాసయన్- పరిమళింపజేయుచున్నట్టిన్ని- ప్రసరత్- అనుగతుడైన-అసమబాణ- మన్మథునియొక్క-ప్రాణవత్-ప్రాణముతోసమానముగానున్నట్టి- గంధవాహః- మలయమారుతము- ఇహ- ఈవసంతకాలమందు- చేతః- మనస్సును- దహతి- దహింపుచున్నది॥౧౦॥ టీ॥ పథికైః- పాంథులచేత-ఉన్మీలత్- పుట్టుచున్నట్టి- మధు- మకరందముయొక్క- గంధ- పరిమళమందు- లుబ్ధ-ఆసక్తిగలిగిన- మధుప- తుమ్మెదలచేతను- వ్యాధూత. కదలించబడిన- చూతాంకుర.మామిడిచిగుళ్లయందు- క్రీడత్- క్రీడింపుచున్న- కోకిల- కోవెలలయొక్క- కాకలీ- మధురధ్వనియొక్క- కలకలైః- కోలాహలములచేతను- ఉద్గీర్ణకర్ణజ్వరాః- ఉద్గీర్ణ- బయలువెళ్లుచున్నట్టి- కర్ణ-చెవులయొక్క- జ్వరాః- తాపముగలిగినట్టి-అమీ-ఈ-వాసరాః-వసంతకాలదినములు- ధ్యానావధానక్షణప్రాప్తప్రాణసమాసమాగమరసోల్లాసైః. ధ్యాన-

స్మైరమీవాసరాః॥౧౦॥అనేకనారీపరిరంభసంభ్రమస్ఫురన్ మనోహారివిలాసలాలసం।మురారిమారాదుపదర్శయంత్యసౌ సఖీసమక్షం పునరాహ రాధికాం॥

చతుర్థాష్టపదీప్రారంభః.

రామక్రియారాగేణగీయతే ॥ ౧ ॥ చందనచర్చితనీలకళేబరపీతవసనవనమాలీ - కేళీచలన్మణికుండలమండితగండయుగస్మితశాలీ ॥ ప ॥ హరిరిహముగ్ధవధూనికరే-విలాసినివిలసితకేళిపరే- హరిరిహముగ్ధవధూనికరే ॥ ౨ ॥ పీనపయోధరభారభరేణహరింపరిరభ్యసరాగం - గోపవధూరనుగాయతి కాచిదుదంచితపంచమరాగం ॥ హరిరిహముగ్ధవధూనికేరే॥ ౩ ॥ కాపివిలాసవిలోల

---

ధ్యానముయొక్క- అవధాన- నేర్పుచేత- క్షణ- క్షణమాత్రము.ప్రాప్త-పొందబడినట్టి-ప్రాణసమా- ప్రియురాండ్రయొక్క-సమాగమరస-సంభోగరసముచేతనైన- ఉల్లాసైః-సంతోషములచేత-కథంకథమపి- అధికప్రయాసముచేతను- నీయంతె- గడపబడుచున్నవి॥౧౧॥టీ॥అసౌసఖీ- ఈచెలికత్తె- ఆరాత్- సమీపమునందు- సమక్షం- ఎదుటను- అనేక- అనేకమూలైన-నారీ-స్త్రీలయొక్క- పరిరంభ- ఆలింగనమందలి- సంభ్రమ- త్వరచేతను- స్ఫురత్- ప్రకాశింపుచున్నట్టిన్ని మురారిం- శ్రీకృష్ణస్వామిని- ఉపదర్శయంతి- చూపించుచున్నదై- రాధికాంరాధనుగూర్చి- పునః-మరల- ఆహ- పలికెను॥

నాలవయష్టపదిటీక.

౧॥టీ॥చందన- శ్రీగంధముచేతను- చర్చితపూయబడినట్టిన్ని- నీల- నల్లనైనట్టికళేబర- శరీరమందు- పీత- పచ్చనైన- వసన.వస్త్రముగలిగినట్టిన్ని- వనమాలీ- వనమాలగలిగినట్టిన్ని- కేళీ- క్రీడలచేతను- చలత్ -కదలుచున్న- మణికుండల- రత్నకుండలముచేతను- మండిత-అలంకరింపడినట్టి- గండ- గండస్థలములయొక్క-యుగ-యుగ్మముగలిగినట్టిన్ని.స్మిత-చిరునవ్వుచేతను-శాలీ-ఒప్పుచున్నట్టి- హరిః-శ్రీకృష్ణస్వామి- ఇహ-ఈవసంతఋతువునందు-హేవిలాసిని-శృంగారభావజనితలీలలుగలయోరాధ-కేళిపరే-కేళి-క్రీడయేపరే-ఉత్కృష్టముగగలిగిన-ముగ్ధవధూనికరే-ముగ్ధ-నవోఢలైన-వధూ-స్త్రీలయొక్క-నికరె-సమూహమందు-విలసతి-విహరింపుచున్నాడు॥౨॥టీక॥ కాచిత్-ఒకానొక-గోపవధూః-గొల్లపడుచు-ఉదంచిత-ప్రకాశింపజేయబడిన-పంచమరాగం-పంచమస్వరముగలిగిన - హరిం-శ్రీకృష్ణస్వామిని - పీనపయోధరభారభరేణ- పీన-బలిసిన-పయోధర-స్తనములయొక్క-భార-భారముయొక్క - భరేణ-అధిక్యముచేత-సరాగము

విలోచనఖేలన జనితమనోజం - ధ్యాయతిముగ్ధవధూరధికం - మధుసూదనవదనసరోజం ॥ హరిరిహముగ్ధవధూనికరే ॥ ౪ ॥ కాపికపోలతలేమిళితా లపితుం కిమపిశ్రుతిమూలె - చారుచుచుంబనితంబవతీదయితంపులకై రనుకూలే ॥ హరిరిహముగ్ధవధూనికరే ॥ ౫ ॥ కేళికలాకుతుకేనచకాచిదముం యమునావనకూలే - మంజుళవంజుళకుంజగతంవిచకర్ష కరేణదుకూలే ॥ హరిరిహముగ్ధవధూనికరే ॥ ౬ ॥ కరతలతాళతరళవలయావళీకలితకలస్వనవంశే - రాసరసేనృత్యపరాహరిణాయువతిప్రశశంసే ॥ హరిరిహముగ్ధవధూనికరే ॥ ౭ ॥ శ్లిష్యతికామపించుబతికామపి-రమయతికామపిరామాం- పశ్యతిసస్మితచారుపరామపరా

---

అనురాగముతోగూడుకొన్నట్లుగా-పరిరభ్య- కౌగిలించుకొనిఅనుగాయతికూడ పాడుచున్నది॥౩॥టీ॥ కాపి-ఒకానొక-ముగ్ధవధూః-గొల్లపడుచు-విలాస॥ మనోజం-విలాసలీలచేత-విలోల-చంచలములైన-విలోచన-కన్నులయొక్క-ఖేలన- క్రీడలచేత-జనిత-పుట్టింపబడిన-మనోజం-మన్మథవికారముగలిగిన-మధుసూదనవదనసరోజం- కృష్ణునిముఖకమలమును-అధికం-మిక్కిలి-ధ్యాయతి-స్మరించుచున్నది॥౪॥టీ॥కాపి-ఒకానొక- నితంబినీ-గొల్లపడుచు-శ్రుతిమూలే-కర్ణమూలమందు-కిమపి-ఒకానొకపలుకును-ఆలపితుం-పలకరించుటకొరకు-పులకైః-రోమాంచములచేత-అనుకూలే-దట్టమైన-కపోలతలే-గండస్థలమునందు-మిళితా-లీనమైనదై-దయితం-ప్రియుని-చారు- సుందరమగునట్లు-చుచుంబ-ముద్దుపెట్టుకొనెను॥౫॥టీ॥ కాచిత్-ఒకానొకస్త్రీ-కేళికళాకుతుకేన- కేళికళా-మన్మథక్రీడలయందు-కుతుకేన-సంతోషముచేత-యమునావనకూలే- కాళిందీజలతీరమునందు-మంజుళవంజుళకుంజగతం-మంజుళ-సుందరమైన-వంజుళ-వకుళవృక్షముయొక్క- కుంజపొదను-గతంః పొందియున్న-అముం-ఈశ్రీకృష్ణస్వామిని-కరేణ-హస్తముచేతను- దుకూలే-పట్టువలువయందు-విచకర్ష-లాగెను॥౬॥టీ ॥ కరతల-హస్తప్రదేశములయొక్క-తాళ-తాళములచేత-తరళ - చంచలములైన-వలయ - కంకణములయొక్క - ఆవళి-పఙ్క్తులచేత-కలిత-విశేషింపబడిన - కలస్వన - మధురధ్వనులుగల - వంశే-పిల్లంగ్రోలుగలిగిన - రాసరసే - రాస - (రాసక్రీడయనగ నడుమనొకపురుషుడును- ఈవలావలనొక్కొకస్త్రీయు నీలాగున స్త్రీలుపురుషులు - మండలాకారముగనృత్యముచేయుట)రాసక్రీడలయందుగల - రసే-మధురరసమందు- నృత్యపరా - నాట్యాసక్తురాలైన-కాచిత్ - ఒకానొకయువతీ - యౌవనవతియైన - శ్రీహరిణా - శ్రీకృష్ణస్వామిచేత-ప్రశంశసే - నుతింపబడెను ॥ ౭ ॥ టీక ॥ హరిః - శ్రీకృష్ణస్వామి - కామపి - ఒకానొకస్త్రీని-శ్లిష్యతి- కౌగిలించుకొనుచున్నాడు- కామపి - మఱియొకస్త్రీని- చుంబతి-

మనుగచ్ఛతివామాం ॥ హరిరిహముగ్ధవధూనికరే ॥ ౮ ॥ శ్రీజయదేవఫణితమి దమద్భుతకేశవకేళిరహస్యం-బృందావనవిపినేచరితంవితనోతుశుభానియశస్యం॥ హరిరిహముగ్ధవధూనికరే ॥ ౧౧ ॥ శ్లో ॥ విశ్వేషామనురంజనేనజనయన్నా నందమిందీవరశ్రేణీశ్యామలకోమలైరుపనయన్నంగైరనంగోత్సవం । స్వచ్ఛం దం వ్రజసుందరీభిరభితః ప్రత్యంగమాలింగితః శృంగారస్సఖిమూర్తిమానివమ ధౌముగ్ధోహరిః క్రీడతి ॥ ౧౨ ॥ అద్యోత్సంగవసద్భుజంగ కబళక్లేశాది వేశా చలంప్రాలేయ ప్లవనేచ్ఛయానుసరతిశ్రీఖండశైలానిలః । కించిత్స్నిగ్ధరసాల

---

ముద్దుబెట్టుకొనుచున్నాడు-కామపిరామాం- మఱియొక స్త్రీని-రమయతి-రమించుచు న్నాడు-పరాం-మఱియొకస్త్రీని - సస్మితచారు-సస్మిత - చిరునవ్వుతోకూడునట్లుగాను న్న-చారు-సుందరమగునట్లుగానున్న-పశ్యతి- వీక్షించుచున్నాడు-వామాం-సౌందర్య వతియైన-అపరాం-మఱియొకస్త్రీని - అనుగచ్ఛతి-వెంబడించిపోవుచున్నాడు॥౮॥ టీక॥ బృందావనవిపినే-బృందావనమనెడియడవియందు - చరితం-ఆచరించబడినట్టిన్ని-యశ స్యం-కీర్తికరమైనట్టిన్ని - అద్భుతం-ఆశ్చర్యకరమైన - కేశవకేళి-శ్రీకృష్ణక్రీడలయొ క్క-రహస్యం-రహస్యముగలిగినట్టిన్ని-శ్రీజయదేవఫణితం - శ్రీజయకవిచేజెప్పబడినట్టి- ఇదం-ఈప్రబంధము-శుభాని-శుభములను-వితనోతు-విస్తరింపజేయుగాక॥౧౧॥ టీ॥ హే సఖి-ఓ రాధ-అనురంజనేన-సంతోషపెట్టుటచేత - విశ్వేషాం-సమస్తజనులకు-ఆనందం- హర్షమును-జనయన్-పుట్టించుచున్నట్టిన్ని-ఇందీవరశ్రేణీశ్యామలకోమలైః-ఇందీవర- నల్లకలువలయొక్క-శ్రేణీ-పఙ్క్తులవలెనే-శ్యామల-నల్లనైనట్టిన్ని-కోమలైః- మృదువులై నట్టిన్ని-అంగైః-అవయవములచేతను-అనంగోత్సవం - మన్మథోత్సవమును-ఉపనయన్- పొందించుచున్నట్టిన్ని-స్వచ్ఛందం - స్వాపేక్షితమవునట్టుగాను-వ్రజసుందరీభిః-గోపికా స్త్రీలచేతను-అభితః-అంతటను-ప్రత్యంగం-ప్రత్యవయవమునందున్ను-ఆలింగితః-ఆలింగ నముచేయబడినట్టిన్ని-మూర్తిమాన్-శరీరముతోగూడిన-శృంగారఇవస్థితః- శృంగార రసమువలెనున్నట్టిన్ని-ముగ్ధః-మనోహరుడైనట్టి-హరిః-శ్రీకృష్ణస్వామి-మధౌ- వసంతకా లమందుక్రీడతి-క్రీడించుచున్నాడు॥౧౨॥ టీ॥ హేసఖి-ఓరాధ-అద్య- ఈవసంతకాలమం దు-శ్రీఖండశైలానిలః-మలయమారుతము-ఉత్సంగ-సమీపమందు-వసత్-ఉన్నట్టి-భుజగ- సర్పములయొక్క-కబళ-గ్రసనమువలనగలిగిన-క్లేశాదివ - బాధలవలననవలెనె-ప్రాలే యప్లవనేచ్ఛయా-ప్రాలేయ-మంచుయందు-ప్లవన-అవగాహనముచేయవలెననెడి-ఇచ్ఛ యా-ఆశచేతను-ఈశాచలం-హిమవత్పర్వతమునుగూర్చి- అనుసరతి-పోవుచున్నది-కించి

మ్రాళిముకుళాన్యాలోక్యహర్షోదయా దున్మీలంతికుహూః కుహూరితికలోత్తా
లాఃపికానాంగిరః॥ *

ఇతిశ్రీకృష్ణదాసజయదేవకృతౌ గీతగోవిందేమహాకావ్యేప్రథమస్సర్గః.

౧౩ ॥ శ్లో॥విహరతివనేరాధాసాధారణప్రణయేహరౌ।విగళితనిజోత్కర్షాదీర్ష్యావశేనగతాన్యతః । క్వచిదపిలతాకుంజేకుంజన్మధువ్రతమండలీముఖరశిఖరేలీనాదీనాప్యువాచరహస్సఖీం॥

పంచమాష్టపదీ ప్రారంభః.

దేశాక్షరీరాగేణగీయతే ॥ ౧ ॥ సంచలదధరసుధా - మధురధ్వనిముఖరిత
మోహనవంశం - చలితదృగంచలచంచల మౌళికపోల విలోలవతంసం ॥ ప॥

---

త్స్నిగ్ధరసాలమహాంముకుళాని- కించిత్- ఇంచుకంత- స్నిగ్ధ- కోమలములైన- రసాల-
మామిడిచెట్లయొుక- మౌళి- అగ్రభాగములయందలి- ముకుళాని- మొగ్గలను- ఆలోక్య-
చూచి- హర్షోదయాత్- సంతోషావిర్భావమువలన- కలోత్తాలాః- మధురస్ఫుటములై
న- కుహూఃకుహూరితి- కుహూకుహూఅనెడి- పికానాం- కోకిలయొుక్క- గిరః-వా
క్కులు- ఉన్మీలంతి- వృద్ధిబొందుచున్నవి॥ *

ఇట్లుశ్రీగీతగోవిందాఖ్యమహాకావ్యటీకయందుప్రథమసర్గము సమాప్తంబాయెను.

౧౩॥ టీ॥ హరౌ- శ్రీకృష్ణస్వామి- సాధారణప్రణయే- సాధారణ- సర్వసాధారణమైన-
ప్రణయే- స్నేహముగలవాడై- వనే- వనమందు- విహరతిసతి- క్రీడించుచుండగా- విగ
ళితనిజోత్కర్షాత్-విగళిత-పోయిన- నిజ- స్వకీయమైన-ఉత్కర్షాత్- అతిశయమువలన
ను- ఈర్ష్యావశేన- ఈర్ష్యా- పరోత్కర్షనుసహించలేకపోవుటకు- వశేన- అధీన
మౌటచేతను- అన్యతః- మఱియొకదిక్కును- గతా-పొందినదై-గుంజత్ *శిఖరే- గుంజ
త్- ఝుంకరించుచున్న-మధువ్రతమండలీ- తుమ్మెదగుంపులచేత-ముఖర- శబ్దించుచున్న-
శిఖరే- కొనలుగలిగిన-లతాకుంజే- పొదరింటియందు- క్వచిత్-ఒకానొకచోట్కు,లీనా-
అణిగినట్టిన్ని- దీనాపి సుఃఖితురాలైనట్టి- రాధా- రాధిక- రహః- ఏకాంతమందు- స
ఖీం- చెలికత్తెను- గూర్చి- ఉవాచ- పలికెను॥

అయిదవ అష్టపది టీక.

౧॥ టీ॥ హేసఖి ఓచెలి-రాసే-రాసక్రీడాస్థలమందు-విహితవిలాసం-చేయబడినలీలలుగలిగి
నట్టిన్ని-కృతపరిహాసం-చేయబడినపరిహాసముగలిగినట్టి-హరిం- శ్రీకృష్ణస్వామిని-మమ-నా
యొుక్క-మనః- మనస్సు-ఇహ- ఈపొందరింటియందు- స్మరతి- స్మరించుచున్నది- సంచ
లత్-చలించుచున్న- అధరసుధా- అధరామృతమునందు. మధుర- శ్రావ్యమైన - ధ్వని-
శబ్దముచేత- ముఖరిత, మ్రోయుచున్నట్టిన్ని- మోహన- వలకి నట్టి- వంశం-పిల్లంగ్రో

రాసేహరిమిహావిహిత విలాసంస్మ రతిమనోమమ కృతపరిహాసం- రాసేహరిమిహావిహితవిలాసం ॥ ౨ ॥ చంద్రక చారుమయూర శిఖండమండల వలయిత కేశం - ప్రచురపురందర ధనురనురంజితమేదురముదిరసువేషం ॥ రాసేహరిమిహావిహితవిలాసం ॥ 3॥ గోపకదంబనితంబవతీముఖచుంబనలంబితలోభం-బంధుజీవమధురాధరపల్లవ కలితదరస్మిత శోభం ॥ రాసేహరిమిహ ॥ ౪ ॥ విపులపులకభుజపల్లవవలయితవల్లవయువతిసహస్రం - కరచరణోరసిమణిగణభూషణకిరణవిభిన్నతమిస్రం॥ రాసేహరిమిహ ॥ ౫ ॥మణిమయ మకరమనోహర కుండల మండిత గండముదారం - పీతవసనమను గతముని మనుజసురాసురవరపరి

---

విగలిగినట్టిన్ని- చలిత- కదలుచున్న- దృక్- చూపులయొక్క- అంచల.కొనలుగలిగినట్టిన్ని- చంచల,కదులుచున్న- మౌళి- కిరీటముగలిగినట్టిన్ని- కపోల- గండస్థలములయందు- విలోల- చలింపుచున్న- వతంస- కర్ణభూషణములుగలిగినట్టి-హరిం-శ్రీకృష్ణస్వామిని- మమ-నాయొక్క- మనః- మనస్సు.ఇహ- ఈపొదరింటియందు- స్మరతి- స్మరింపుచున్నది॥౨॥టీ॥ చంద్రక- మేచకములచేత- చారు- ఒప్పుచున్న- మయూర- నెమళ్లయొక్క- శిఖండక- పింఛములయొక్క- మండల- సమూహముచేత- వలయిత- చుట్టబడిన- కేశం- వెండ్రుకలుగలిగినట్టిన్ని- ప్రచుర- నిస్తామయిన- పురందరధనుః- ఇంద్రధనస్సులచేత- అనురంజిత- అలంకరింపబడినట్టిన్ని- మేదుర- నల్లనైనట్టి- ముదిర- మేఘమువంటి- సువేషం- మంచివేషముగలిగినట్టి- హరిం- శ్రీకృష్ణస్వామిని- మమ- నాయొక్క-మనః- మనస్సు- స్మరతి- స్మరింపుచున్నది॥3॥టీ॥గోపకదంబ-గొల్లగుంపులయొక్క- నితంబవతీ- స్త్రీలయొక్క- ముఖచుంబన- మోముముద్దులయందు.లంబిత- ప్రాప్తమైన- లోభం- అనురాగముగలిగినట్టిన్ని- బంధుజీవ- మంకెనపువ్వువలె- మధుర- సుందరమైన- అధరపల్లవ- చిగురువంటిమోవియందు- కలిత- కూడుకొన్నట్టి- దరస్మిత- మందహాసముయొక్క- శోభం- కాంతిగలిగినట్టి- హరిం- శ్రీకృష్ణస్వామిని- మమ- నాయొక్క- మనః- మనస్సు- స్మరతి- స్మరింపుచున్నది॥౪॥టీ॥విపులఅధికమైన- పులక-రోమాంచములుగల- భుజపల్లవ- బాహుపల్లవములచేత- వలయిత- చుట్టబడిన.వల్లవయువతి- గొల్లపడుచులయొక్క- సహస్రం- వేయిగలిగినట్టిన్ని- కరచరణోరసి- కర- హస్తములయందును- చరణ-పాదములయందును- ఉరసి- వక్షస్థలమందును- మణిగణ-రత్నసమూహములుగలిగిన- భూషణ.ఆభరణములయొక్క- కిరణ-కాంతులచేత- విభిన్న- భేదింపబడిన- తమిస్రం- చీకటిగలిగినట్టి-హరిం- శ్రీకృష్ణస్వామిని- స్మరతి- స్మరింపుచున్నది॥౫॥టీ॥మణిమయ- రత్నవికారమైన- మకర- మొసళ్లవలె- మనోహర- ఒప్పుచున్న- కుండల- కర్ణభూషణములచేత-మండిత-అలంకరింపబడిన-గండం-చెక్కిళ్లుగలిగినట్టిన్ని - ఉదారం-

వారం॥ రాసేహరిమిహ || ౬ || విశదకదంబతలేమిళితం కలికలుషభయంశమ యంతం - మామపికిమపితరంగదనంగదృశామనసారమయంతం ॥ రాసేహరిమి హావిహి || ౭ || జలదపటలచలదిందువినిందకచందనబిందులలాటం-పీనపయోధ రపరిసరమర్దననిర్దయహృదయకవాటం ॥ రాసేహరిమిహ || ౮ || శ్రీజయదేవ ఫణితమతిసుందరమోహనమధురిపురూపం - హరిచరణస్మరణంప్రతిసంప్రతిపు ణ్యావతామనురూపం॥ రాసేహరిమిహావిహి || ౯|| శ్లో || గణయతిగుణగ్రామం భ్రామంభ్రమాదపినేహతేవహతిచపరితోషంరోషంవిముంచతిదూరతః । యు

---

గంభీరుడైనట్టిన్ని - పీతవసనం- పీతాంబరముగలిగినట్టిన్ని- అనుగత- అనుసరింపుచున్న- ముని-ఋషులును-మనుజ-మనుష్యులును-సుర-దేవతలును-అసుర-రాక్షసులును-వరపరి వారం - ముఖ్యపరిచారకులుగాగలిగినట్టి-హరిం- శ్రీకృష్ణస్వామిని - స్మరతి-స్మరింపుచు న్నది॥౬॥ టీక॥ విశద-నిర్మలమైన-కదంబ-కడిమచెట్లయొక్క-తలే-ప్రశమందు- మిళితం- చేరియున్నట్టిన్ని-కలికలుషభయం - కలియుగపుపాపభీతిని-శమయంతం-పోగొట్టుచు న్నట్టిన్ని-కిమపి-ఇంచుకంత-తరంగత్-చలింపుచున్న - అనంగదృశా-మన్మథోద్దీపకదృ ష్టిగల-మనసా-మనస్సుచేత - మామపి-నన్నును - రమయంతం - రజిల్ల జేయుచున్నట్టి- హరిం-శ్రీకృష్ణస్వామిని-స్మరతి-స్మరింపుచున్నది॥౭॥ టీ॥ జలదపటల- మేఘసమూహమునం దు-చలత్-చలింపుచున్న-ఇందు-చంద్రుని-వినిందక- నిందింపుచున్నట్టి-చందనబిందు-శ్రీ గంధపుతిలకముగలిగిన-లలాటం-నుదురుగలిగినట్టిన్ని-పీన-బలిసిన- పయోధర- స్తనముల యొక్క-పరిసర-సమీపమందు-మర్దన-మర్దించుటయందు-నిర్దయ-దయలేనట్టి - హృదయక వాటం-తలుపువంటి డెందముగలిగినట్టి-హరిం-శ్రీకృష్ణస్వామిని-స్మరతి-స్మరింపుచున్నది॥ ౮॥ టీ॥ అతిసుందరమోహనమధురరిపురూపం-అతిసుందర-మిక్కిలిచక్కనైన- మోహన మోహకరమైన-మధురిపు- శ్రీకృష్ణస్వామియొక్క- రూపం-స్వరూపముగలిగిన- శ్రీజయ దేవకవిఫణితం-శ్రీజయదేవకవిచేత జెప్పబడిన యీగీతము-పుణ్యావతాం- పుణ్యపురుషుల కు-హరిచరణస్మరణం-ప్రతి-శ్రీకృష్ణపాదధ్యానమునుగూర్చి-సంప్రతి-ఇప్పుడు - అనురూ పం-యోగ్యమైనది-రాసె-రాసక్రీడాస్థలమందు-విహితవిలాసం-విహిత - చేయబడిన-వి లాసం-క్రీడగలిగిన-హరిం-శ్రీకృష్ణస్వామిని-మమ-నాయొక్క - మనః-మనస్సు-స్మరతి- స్మరింపుచున్నది॥౧౯॥ టీక॥ మమ-నాయొక్క-మనః-మనస్సు-వామం-వక్రమైనదై-మాం వినా-నన్నువిడచి-విహారిణి-క్రీడింపుచున్నట్టిన్ని-యువతిషు - ఇతరస్త్రీలయందు-వలత్తృ ష్ణే-వలత్-వృద్ధినిబొందుచున్న-తృష్ణే-ఆశగలిగినట్టి-కృష్ణే-శ్రీకృష్ణునియందు-పునరపి- తిరిగిన్ని-కామం - అభిలాషను-కరోతి-చేయుచున్నది-గుణగ్రామం - శ్రీకృష్ణగుణసమూ

వతిషువలత్స్వపి కృష్ణే విహారిణిమాంవినా పునరపిమనోవామం కామంకరో తికరోమికిం॥

## షష్ఠాష్టపదీప్రారంభః.

గుణక్రియారాగేణగీయతే ॥ ప ॥ సఖికేశిమథనముదారం॥- రమయమయాసహ మదనమనోరథభావితయాసవికారం ॥ ౧ ॥ నిభృతనికుంజగృహంగతయానిశిర హసినిలీయవసంతం - చకితవిలోకితసకలదిశారతిరభసవశేనహసంతం ॥ సఖికే శిమథనముదారం ॥ ౨ ॥ ప్రథమసమాగమలజ్జితయాపటుచాటుశతైరనుకూ లం - మృదుమధురస్మితభాషితయాశిథిలీకృతజఘనదుకూలం ॥ సఖి॥ ౩ ॥ కిసలయశయననివేశితయాచిరమురసిమమైవశయానం - కృతపరిరంభణచుం

---

హాముసు-గణయతి-ఎంచుచున్నది-భ్రామం - చలనమును- భ్రూమాదపి - భ్రూంతివలననైనను - సహతే - కోరను - పరితోషం - సంతోషమును - వహతి - వహించుచున్నది- రోషం- క్రోధమును- దూరతః-దూరముగాను-విముంచతి-విడుచుచున్నది-అహం నేను- కింకరోమి-ఏమిసేయుదును॥

### అజనయష్టపదీటీక.

హేసఖి-ఓచెలి-ఉదారం-చక్కనివాడైనట్టి-కేశిమథనం-కేశియనెడిరాక్షసునివధించినశ్రీకృష్ణస్వామిని-మదనమనోరథభావితయా-మదనమనోరథ-కామక్రీడాభిలాషచేత-భావితయా-సంభావితురాలై-మయాసహ-నాతోడగూడ-సవికారం - నఖక్షతాదిచేష్టలతోగూడునట్లు-రమయ-క్రీడింపజేయుమా॥౧॥ టీ॥ నిభృతనికుంజగృహం- నిభృత-నిశ్శబ్దమైన-నికుంజగృహం-పొదరింటిని-గతయా-పొందిన-మయాసహ- నాతోగూడ-నిశి-రాత్రియందు-రహసి-ఏకాంతమందు-నిలీయ-అణగి-వసంతం-ఉన్నట్టిన్ని- చకితవిలోకితసకలదిశా-చకిత-భయముచేత- విలోకిత-చూడబడిన-సకలదిశా- ఎల్లదిక్కులుగలిగిన నాతోడ-రతిరభసవశేన-రతి-క్రీడలయొక్క-రభస-సంతోషమునకువశేన-అధీనమౌట చేత-హసంతం - నవ్వుచున్నట్టిన్ని - శ్రీకృష్ణస్వామిని- రమయ- రమింపజేయుము॥౨॥ టీ॥ హేసఖి- ఓచెలి-ప్రథమసమాగమలజ్జితయా-ప్రథమసమాగమ-తొలికూటమియందు- లజ్జితయా-సిగ్గుపడియున్ననాతోడ-పటుచాటుశతైః- పటు-వశీకరణసమర్థములైన- చాటు-నేర్పుమాటలయొక్క-శతైః-అనేకములచేత- అనుకూలం-అనుకూలుడైనట్టిన్ని- మృదు-కోమలములైన-మధుర-మనోహరములైన- స్మితభాషితయా-చిరునవ్వుతోగూడిన పలుకులుగలిగిన నాతోడశిథిలీకృతజఘనదుకూలం-శిథిలీకృత-వదలింపబడిన-జఘన-మొలయందుగల-దుకూలం-పట్టువలువగల-శ్రీకృష్ణుని-రమయ-రమింపచేయుమా ॥ ౩॥ టీ॥ హేసఖి-ఓచెలి-కిసలయశయననివేశితయా-కిసలయ-చివుళ్లయొక్క-శయన-పాన్పునందు-

బనయాపరిరభ్యకృతాధరపానం ॥ సఖి ॥ ౪ ॥ అలసనిమీలితలోచనయాపులకావళిలలితకపోలం - శ్రమజలసకలకళేబరయావరమదనమదాదతిలోలం॥సఖి॥ ౫ ॥ కోకిలకలరవకూజితయాజితమనసిజతంత్రవిచారం - శ్లథకుసుమాకులకుంతలయాసఖిలిఖితఘనస్తనభారం ॥ సఖి ॥ ౬ ॥ రతిసుఖసమయరసాలసయాదరముకుళితనయనసరోజం - నిస్సహనిపతితతనులతయామధుసూదనముదితమనోజం ॥ సఖి ॥ ౭ ॥ చరణరణితమణినూపురయాపరిపూరితసురతవితానం

---

నివేశితయా-కూర్చున్ననాతోడ-చిరం-తడవుగానునుము- నాయొక్క-ఉరస్యేవ-వక్షస్థలమందే-శయానం-పండుకొనియున్నట్టిన్ని- కృతపరిరంభణచుంబనయా-కృతచేయబడిన-పరిరంభణ-ఆలింగనమందు-చుంబనయా- ముద్దులుగలనాతోడ-పరిరభ్య-కౌగిలించుకొని-కృతాధరపానం-కృతచేయబడిన-అధరపానం- అధరపానముగలిగిన-శ్రీకృష్ణుని-రమయ-రమింపజేయుమా॥౪॥టీ॥ హేసఖి-ఓచెలికత్తె-అలస-మెల్లిగాను-నిమీలిత-ముయ్యబడిన-లోచనయా- కన్నులుగలనాతోడను- పులకావళిలలితకపోలం- పులక-రోమాంచములయొక్క-ఆవళి-వర్సలచేతను-లలిత- ఒప్పుచున్న-కపోలం- గండస్థలములుగలిగినట్టిన్ని-శ్రమజల-స్వేదోదకము-సకల-సమస్తమైన- కళేబరయా-శరీరమందుగలనాతోడను-వరశ్రేష్ఠమైన-మదన-మన్మథునివలనగలిగిన-మదాత్- హర్షముమువలన-అతిలోలం-మిక్కిలియాశతోగూడియున్న-శ్రీకృష్ణస్వామిని-రమయ-రమింపజేయుమా॥౫॥టీ॥ హేసఖి-ఓచెలి-కోకిల-కోవెలలయొక్క-కలరవ- అవ్యక్తమధుర-ధ్వనివంటికూజితయా-పలుకులుగలిగిననాతోడను-జిత-జయింపబడిన-మనసిజతంత్రవిచారం- కామశాస్త్రవిచారముగలశ్రీకృష్ణుని-రమయ-రమింపజేయుమా-శ్లథ-వీడిన- కుసుమ-పువ్వులచేతను-ఆకుల-కదులుచున్న-కుంతలయా-ముంగురులుగలనాతోడను - సఖి-గోళ్లచేతను-లిఖిత-నాటింపబడిన-ఘన-గొప్పలైన-స్తనభారం- కుచభారముగలిగిన- శ్రీకృష్ణుని-రమయ-రమింపజేయుమా॥౬॥టీ॥ హేసఖి-ఓచెలీ-రతిసుఖ- సురతసుఖముయొక్క-సమయ-వేళయందు-రస-అనురాగముచేత-అలసయా-అలసిననాతోడ-దర-యించుకంత-ముకుళితముయ్యబడిన-నయనసరోజం- తామరరేకులవంటికన్నులుగలిగినట్టిన్ని- నిస్సహ-రతిశ్రమచేతదుర్బలమైనదిగనుకనే-నిపతిత-పడుచున్న-తనులతయా-కోమలమైనశరీరముగలనాతోడను-ఉదిత-పుట్టింపబడిన-మనోజం-మన్మథుడుగలిగిన-మధుసూదనం-శ్రీకృష్ణుని-రమయ-క్రీడింపజేయుమా॥౭॥ టీ॥ హేసఖి-ఓచెలి-చరణ-పాదములయందు-రణిత-మ్రోయుచున్న-మణినూపురయా-రత్నఖచితములైన-అందెలుగలనాతోడను-పరిపూరిత - నిండింపబడిన- సురత- క్రీడలయొక్క- వితానం- ఆధిక్యముగలిగినట్టిన్ని- ముఖర-

ముఖరవిశృంఖల మేఖలయా సకచగ్రహచుంబనదానం ॥ సఖి ॥ ౮ ॥ శ్రీజయ
దేవభణితమిదమతిశయమధురిపునిధువనశీలం - సుఖముత్కంఠితరాధికయా కథి
తం వితనోతు సలీలం ॥ సఖి కేశి ॥ ౧౫ ॥ శ్లో॥ హస్తస్రస్తవిలాసవంశమనృజుభ్రూ
వల్లిమద్వల్లవీబృందోత్సారిదృగంతవీక్షితమతిస్వేదార్ద్రగండస్థలం । మాము
ద్వీక్ష్యవిలజ్జితస్మితసుధాముగ్ధాననం కాననే గోవిందం వ్రజసుందరీపరివృతం పశ్యా
మిహృష్యామిచ ॥ ౧౬ ॥ దురాలోక స్తోకస్తబక నవకాశోక లతికావికా

---

మ్రోయుచున్న-విశృంఖల-దృఢమైన-మేఖలయా-మొలనూలుగలనాతోడను-సకచగ్రహ-కొప్పుపట్టుకొనుటతోగూడిన- చుంబనదానం- అధరచుంబనదానముగలిగిన-శ్రీకృష్ణుని-రమయ-రమింపజేయుము॥ ౮॥ టీ॥ శ్రీజయదేవ- జయదేవకవిచేతను -భణితం-చెప్పబడినట్టిన్ని-అతిశయ-అధికమైన - మధురిపునిధువన- శ్రీకృష్ణరతవ్యాపార-శీల-స్వభావముగాగలిగినట్టిన్ని-సలిలం- విలాసములతోగూడినట్టిన్ని- ఉత్కంఠిత-ఆసక్తిశేషముగల-రాధికయా-రాధచేతను-కథితం- పలుకబడినట్టి- ఇదం- ఈగీతము,సుఖం-సౌఖ్యమును-వితనోతు-విస్తరింపజేయుగాక॥౧౫॥ టీ॥ కాననే-వనమందు - హస్తస్రస్తవిలాసవంశం-హస్త-హస్తమునుండి-స్రస్త-జారిన-విలాస-లీలార్హమైన-వంశం-పిల్లంగ్రోవిగలిగినట్టిన్ని-అనృజుభ్రూవల్లిమద్వల్లవీబృందోత్సారిదృగంతవీక్షితం - అనృజ-కుటిలమైన-భ్రూవల్లిమత్-కనుబొమ్మలుగలిగినటువంటి-వల్లవీ-గోపికాస్త్రీలయొక్క-బృంద - సమూహముయొక్క-ఉత్సాహ- సంతోషముగల- దృక్-దృష్టులయొక్క-అంత- కొనలచేతను-వీక్షితం-చూడబడినట్టిన్ని- అతిస్వేదార్ద్రగండస్థలం- అతి- అధికమైన స్వేద- చెమటచేతను-అర్ద్ర-తడిపిన-గండస్థలం-చెక్కిళ్లుగలిగినట్టిన్ని- మాం-నన్ను-ఉద్వీక్ష్య-చూచి-విలజ్జిత-సిగ్గుపడినట్టిన్ని-స్మిత-చిరునవ్వనెడి-సుధా- అమృతముచేతను-ముగ్ధ-మనోహరమైనట్టి-ఆననం-ముఖముగలిగినట్టిన్ని-వ్రజసుందరీ-గోపికాస్త్రీలచేతను- పరివృతం-చుట్టబడియున్నట్టి-గోవిందం-గోపాలకృష్ణుని-పశ్యామి-చూచుచున్నాను- హృష్యామిచ-సంతోషపడుచున్నాను॥౧౬॥ టీ॥ హేసఖి-ఓచెలి-దురాలోక- చూడనశక్యమైనట్టిన్ని స్తోక-కొంచెములైన-స్తబక-పూగొత్తులయందు-నవక నూతనములైన- అశోక- అశోకవృక్షములయొక్క-లతికా-తీగెలయొక్క-వికాసః-వికసనముగలిగినట్టిన్ని-అయం-ఈ-కాసారోపవనపవనః-కాసార-సరస్సులతోగూడిన- ఉపవన- ఉద్యానవనమందలి-పవనః- వాయువు-వ్యథయతి- బాధింపుచున్నది-అపిచ- ఇంతేకాదు-భ్రామ్యత్ -తిరుగుచున్న-భృంగీ-ఆడుతుమ్మెదలయొక్క - రణిత - ఝుంకారములచేతను - రమణీయా- ఒప్పుచున్నట్టి - శిఖరి

సఃకాసారోపవనపవనోయంవ్యథయతి । అపిభ్రాష్యద్భృంగిరణితరమణీయా నముకుళప్రసూతిశ్చూతానాంసఖిశిఖరిణీయంసుఖయః॥ *

ఇతిశ్రీకృష్ణదాసజయదేవకృతౌ - గీతగోవిందేమహాకావ్యే-ద్వితీయస్సర్గః.

౧౬ ॥ శ్లో ॥ కంసారిరపిసంసారవాసనాబద్ధశృంఖలాం। రాధామాధాయహృదయేతత్యాజవ్రజసుందరీః॥ ౧౭॥ ఇతస్తత స్తామనుసృత్య రాధికామనంగబాణవ్రణఖిన్నమానసః । కృతానుతాపస్సకళిందనందనీతటాంతకుంజేవిషసాదమాధవః॥ *

సప్తమాష్టపదీప్రారంభః,

౧॥ ఘూర్జరీరాగేణగీయతె ॥ మామియంచలితావిలోక్యవృతంవధూనిచయేన - సాపరాధతయామయాపిన వారితాతిభయేన ॥ ప ॥ హరిహరిహతాదర

---

ణీ-అగ్రములుగలిగినట్టి-ఇయం- ఈ- చూతానాం- మామిడిచెట్లయొక్క-ముకుళప్రసూతిః-ముకుళ- మొగ్గలయొక్క-ప్రసూతిః-సంతతి- నసుఖయతి-దుఃఖపెట్టుచున్నది॥

శ్రీగీతగోవిందమహాకావ్యటీకయందు-ద్వితీయస్సర్గముసమాప్తంబాయెను.

౧౬॥ టీక ॥ కంసారిరపి-శ్రీకృష్ణుండును-సంసారవాసనాబద్ధశృంఖలాం-సంసార-సంసారముయొక్క-వాసనా-పూర్వజన్మవాసనచేత-బద్ధ - కట్టబడిన-శృంఖలాం-ఆసక్తిరూపమైన-సంకిళ్లుగలిగిన-రాధాం-రాధను-హృదయే-మనస్సునందు-ఆధాయ-ఉంచుకొని-వ్రజసుందరీః-గోపికాస్త్రీలను-తత్యాజ- పరిత్యజించెను॥ ౧౭॥ ॥ టీక ॥ ఇతస్తతః-ఇవతలావతలను-తాం-రాధాం-ఆరాధను-అనుసృత్య-వెదకి- అనంగబాణవ్రణఖిన్నమానసః- అనంగ-మన్మథునియొక్క-బాణ- బాణమువలననైనను- వ్రణ- గాయములచేతను-ఖిన్న-క్లేశముతోగూడిన-మానసః-మనస్సుగలిగినట్టిన్ని-కృతానుతాపః-కృత-చేయబడిన-అనుతాపః. పశ్చాత్తాపముగలిగిన-సమాధవః-ఆశ్రీకృష్ణస్వామి-కళిందనందినీతటాంతకుంజే కళిందనందినీ-యమునానదియొక్క-తటాంత- దరియందుగల-కుంజే-పొదరింటియందు-విషసాద-విచారపడెను॥

ఏడవ అష్టపదటీక.

౧॥ టీక ॥ ఇయం-ఈరాధిక-వధూనిచయేన-స్త్రీసమూహముచేతను- వృతం-చుట్టబడియున్న-మాం-నన్ను-విలోక్య-చూచి-చలితా-కదలిపోయెను-సాపరాధతయా-అపరాధముతోగూడుకొనియుండుటచేతను - అతిభయేన-అత్యంతభయముగలిగిన-మయాపి-నాచేతనున్ను-నవారితా- అడ్డగించబడకపోయెను- హతాదరతయా-హత-పోయిన-

తయాసాగతాకుపితేవ ॥ హరిహరి ॥ ౨ ॥ కింకరిష్యతికింవదిష్యతిసాచిరంవి
విరహేణ - కింజనేన నేన కింమమభూషణేన గృహేణ ॥ హరి హరి ॥ ౩ ॥
చింతయామితదాననంకుటిలభ్రుకోపభరేణ - శోణపద్మమివోపరిభ్రమతాకు
లంభ్రమరేణ ॥ హరి హరి ॥ ౪ ॥ తామహంహృదిసంగతామనిశంభృశంరమ
యామి - కింవనేనుసరామితామిహకింవృథా విలపామి ॥ హరిహరి ॥ ౫ ॥
తన్విఖిన్నమసూయయాహృదయంత వకలయామి - తన్న వేద్మికుతోగతా
సినతేనతేనునయామి ॥ హరి హరి ॥ ౬ ॥ దృశ్యసేపురతోగతాగత మేవమేవిద
ధాసి - కింపురేవస సంభ్రమంపరిరంభణం నదదాసి ॥ హరిహరి ॥ ౭ ॥
క్షమ్యతామపరంకదాపిత ఈదృశంనకరోమి - దేహిసుందరిదర్శనంమమమన్మ

---

ఆదరతయా-ఆదరణగలుగుటచేతను-సా-ఆరాధ-కుపితేవ-కోపించినదానివలెనే-గతా
పోయెను-హరిహరి-దుఃఖము ॥ ౨ ॥ టీ ॥ సా-ఆరాధ- చిరం-ఎల్లప్పుడున్ను- విరహేణ-విర
హముచేతను-కింకరిష్యతి-ఏమిచేయగలదు- కింవదిష్యతి-ఏమిచెప్పగలదు-మమ-నాకు-జ
నేన-మనుష్యునిచేతనున్ను-ధనేన-ధనముచేతనున్ను-భూషణేన-అలంకారముచేతనున్ను
గృహేణ-ఇంటిచేతనున్ను-కిం-ఏమికార్యము ॥ ౩ ॥ టీ ॥ కోపభరేణ-కోపాతిశయముచేత
ను-కుటిలభ్రు-కుటిల-వక్రములైన - భ్రు-కనుబొమ్మలుగలిగిన-తదాననం-తత్-ఆరాధ
యొక్క-ఆననం-ముఖమును-ఉపరి-మీదను- భ్రమతా-తిరుగుచున్న-భ్రమరేణ-తుమ్మెద
లచేతను-ఆకులం-వ్యాకులమైన-శోణపద్మమివ - ఎఱ్ఱదామరనువలెనే-చింతయామి-చిం
తింపుచున్నాను ॥ ౪ ॥ టీ ॥ హృది-హృదయమందు-సంగతాం- కూడియున్న-తాం-ఆరాధ
ను-అహం-నేను-అనిశం-ఎల్లప్పుడున్ను-భృశం-మిక్కిలి-రమయామి-క్రీడింపుచున్నాను-
ఇహవనే-ఈవనమందు-కిం-ఎందుకొరకు-అనుసరామి-వెదకుచున్నాను- వృథా-వ్యర్థము
గాను-కిం-ఎందుకొరకు- విలపామి - విచారపడుచున్నాను ॥ ౫ ॥ టీ ॥ హేతన్వి-ఓరాధా-
తవ-నీయొక్క-హృదయం-హృదయమును - అసూయయా-ఈర్ష్యచేతను-ఖిన్నం-ఖేద
మునుబొంచియున్నదాన్నిగాను-సదా-ఎల్లప్పుడును-అహం- నేను-ఆకలయామి-తలంచు
చున్నాను-నతేన-నమ్రభావముచేతను-తే-నీకొఱకు- అనునయామి-మంచిమాటలాడుచు
న్నాను-కుతః-ఎందుకొఱకు-గతా-పోయినదానవు- అసి- అవుచున్నావు-తత్-దాన్నినవే
ద్మి-ఎరుగను ॥ ౬ ॥ టీ ॥ మే-నాకు-పురతః-ముందరను-దృశ్యసే-కనుపడుచున్నావు-గతా
గతమేవ-రాకపోకలనే-విదధాసి-చేయుచున్నావు- కిం-ఎందుకొరకు-పురేవ-తొల్లిటివ
లె-ససంభ్రమం-తొట్రుపాటుతో-పరిరంభణం - ఆలింగనమును-నదదాసి-ఇయ్యకయు
న్నావు ॥ ౭ ॥ టీ ॥ హేసుందరి-ఓరాధ-క్షమ్యతాం - ముందుచేసినఅపరాధముక్షమించబడు

ఘేనధునోమి ॥ హరి హరి ॥ ౧౮ ॥ వర్ణితంజయదేవకేనహరేరిదంప్రవణేన-
తిందుబిల్వసముద్రసంభవరోహిణీరమణేన ॥ హరి హరి ॥ ౧౯ ॥ శ్లో ॥ హృ
దిబిసలతాహారోనాయం భుజంగమనాయకః కువలయదళశ్రేణీకంఠేనసాగర
ళద్యుతిః । మలయజరజోనేదంభస్మప్రియారహితేమయి ప్రహరనహరభ్రాం
త్యానంగక్రుధాకి ముధావసి ॥ ౨౦ ॥ పాణౌమాకురుచూతసాయకమముం
మాచాపమారోపయ క్రీడానిర్జితవిశ్వమూర్ఛిత జనాఘాతేనకిం పౌరుషం।
తస్యాఏవ మృగీదృశో మనసిజప్రేంఖత్కటాక్షాశుగ శ్రేణీజర్జరితం మనా
గపిమనోనాద్యాపి సంధుక్షతే ॥ ౨౧ ॥ భ్రూచాపేనిహితః కటాక్షవిశిఖోని

---

గాక-తే-నీకొరకు-ఈదృశం-ఇటువంటి-అపరం-మరియొకఅపరాధమును-కదాపి-ఒకా
నొకప్పుడు - నకరోమి-చేయను-మమ- నాకు-తే . నీయొక్క-దర్శనం-దర్శనమును-దే
హి-ఇమ్ము-పన్నఘేన-పన్నభుని చేతను-ధునోమి - పరితాపమునుబొందుచున్నాను॥౧౮॥
టీ॥ హరేః-శ్రీకృష్ణస్వామికి-ప్రవణేన-సేవకుడైనట్టిన్ని-తిందుబిల్వ-తిందుబిల్వగ్రామము
నెడి-సముద్ర-సముద్రమందు-సంభవ-పుట్టిన-రోహిణీరమణేన- చంద్రుడైన-జయదేవకే
న-జయదేవకవిచేతను-ఇదం-ఈగీతము-వర్ణితం-రచియింపబడెను ॥ ౧౯ ॥ టీక॥ హే
అనంగ-ఓయిమన్మథుడా-హృది-రొమ్మునందు-అయం-ఇది - బిసలతాహారః-తామరకా
డలదండ-భుజంగమనాయకః-సర్పరాజైనవాసుకి-న - కాదు-కంఠే-కంఠమందు-కువల
యదళశ్రేణీ-నల్లకలువరేకులపఙ్క్తి-సా-అది-గరళద్యుతిః - గరళవిషముయొక్క-ద్యు
తిః-కాంతి-న-కాదు-ఇదం-ఇది-మలయజరజః- శ్రీగంధపుపరాగము-భస్మ- భస్మము-న-
కాదు-ప్రియారహితే-ప్రియురాలినెడబాసియున్న-మయి-నాయందు-హరభ్రాంత్యా-శివు
డనెడిభ్రమచేతను-నప్రహర - కొట్టకుము- క్రుధా- క్రోధముచేతను-కిము-ఎందుకొర
కు-ధావసి-పరుగుచున్నావు॥ ౨౦ ॥ టీక॥ క్రీడానిర్జితవిశ్వ-క్రీడా-విలాసముచేత-
నిర్జిత-జయింపబడిన-విశ్వ- ప్రపంచముగలిగిన- హేమనసిజ- ఓమన్మథుడా- పాణౌ-
హస్తమందు- చూతసాయకం- మామిడిచిగుళ్లనెడిబాణమును- మాకురు- చేయకుము-
అముంచాపం- ఈధనుస్సును- మారోపయ- ఎక్కుపెట్టకుము- మూర్ఛితజనాఘాతేన-
మూర్ఛిత- మూర్ఛబొందియున్న- జన- జనులయొక్క- ఆఘాతేన- కొట్టుటచేతను-కిం-
ఏమి-పౌరుషం-పురుషధర్మము-మృగీదృశః- లేడిచూపులవంటిచూపులుగలిగిన-తస్యాఏవ
ఆరాధనుయొక్కయే-ప్రేంఖత్-చలింపుచున్న-కటాక్ష-కడగంటిచూపులనెడి-ఆశుగ-
బాణములయొక్క-శ్రేణీ- పఙ్క్తులచేతను- జర్ఝరితం- నొవ్వబడిన-మే-నాయొక్క-
మనః- మనస్సు- మనాగపి- కొంచమైనను- అద్యాపి- ఇప్పుడున్ను- నసంధుక్షతే- స్వాస్థ్యప
డలేదు-నసంతుష్యతి- సంతోషపడలేదు- అనియొకపాఠముగలదు ॥ ౨౧॥ టీక॥ హేత
న్వి-ఓకాన్తా- ఘూర్ణిచాపే భ్రూలనుబొమ్మలనెడి-చాపే- వింటియందు-నిహితః-సంధిం

ర్మాతుమర్మ వ్యధాంశ్యా మాత్మాకుటిలః కరోతుకబరీ భారోపిమా రోద్యమః।
మోహంతా వదముం చతన్వితనుతాం బిబాధరో రాగవాక్ సద్వృత్తస్తన
మండలంతవ కథం ప్రాణైర్మమక్రీడతే ॥ ౨౨ ॥ తానిస్పర్శసుఖాని తేపిసర
ళాస్స్నిగ్ధాదృశోర్విభ్రమా స్తద్వక్త్రాంబుజ సౌరభంసచసుధా స్యందీగిరాం
వక్రిమా । సాబింబాధర మాధురీతివిషయాసం గేపిచేన్మా నసంతస్యాంలగ్న
సమాధీహంతవిరహవ్యాధిఃకథంవర్తతే ॥ ౨౩ ॥ భ్రూపల్లవంధనురపాంగ

---

చబడిన-కటాక్షవిశిఖః-కడకంటిచూపులనెడిబాణము- మర్మవ్యధాం-మర్మ-మర్మస్థానమందు-వ్యధాం-బాధను-నిర్మాతు- చేయుగాక- బాణముజీవస్థానమందుబాధగలుగజేయుటయుక్తమె-శ్యామాత్మా- నల్లనిస్వరూపముగలిగినట్టిన్ని- కుటిలః- వక్రమైన-కబరీభారః-కబరి-కొప్పుయొక్క-భారః-అతిశయము- మారోద్యమం - మరణోద్యోగమును-కరోతు-చేయుగాక ( నల్లనిరూపముగలిగి కుటిల స్వభావుడైయున్నవాడు మరణోద్యోగముచేయుటఆశ్చర్యముగాదు) రాగవాన్ - రక్తిమగలిగిన- అయం-ఈ-బింబాధరః-దొండపండువంటిఅధరము- మోహం- మోహమును- వనుతాం-విస్తరింపజేయుగాక-(అనురాగవంతుడుమోహమునుగలుగజేయుటవిచిత్రముగాదు)తవ.నీయొక్క.సద్వృత్తస్తనమండలం-సత్-లెస్సైనట్టిన్ని-వృత్త-గుండ్రనైనట్టి- స్తనమండలం- కుచమండలము-మమ-నాయొక్క-ప్రాణైః-ప్రాణములతోడను-కథం-ఎట్లు-క్రీడతి- ఆడుచున్నది (సద్వృత్తుడనగాసదాచారముగలవాడు ప్రాణహింసజేయుటయుక్తముగాదనిభావము॥ ౨౨॥ టీ॥స్పర్శ-స్పృశించుటచేతనైన-సుఖాని-సుఖములు- తాని-అటువంటివి-తరళాః-చంచలములైనట్టిన్ని-స్నిగ్ధాః-మనోహరములైనట్టి-దృశోః-నేత్రములయొక్క-విభ్రమాః-విలాసములు-తె-అటువంటివి-వక్త్రాంబుజసౌరభం వక్త్రాంబుజ-ముఖకమలముయొక్క-సౌరభం-పరిమళము-తత్-అటువంటిది-సుధాస్యందీ-అమృతమునుగురియుచున్న-గిరాం-వాక్కులయొక్క-వక్రిమా- వక్రత్వము [అనగాఅర్థాంతరధ్వనిగలిగియుండుట] సచ-అటువంటిది-బింబాధరమాధురీ-బింబ-దొండపండువంటి-అధర-మోవియొక్క- మాధురీ-మాధుర్యము-నా-అటువంటిది-ఇతి-ఇట్లని-విషయాసంగే-విషయ-విషయములయొక్క-ఆసంగే-కూటమియందు-మానసం-మనస్సు-లగ్నసమాధిచేత్- లగ్న-తగిలిన- సమాధిచేత్-ధ్యానముగలిగినదాయెనా-తస్యాం-ఆరాధవిషయమై-విరహవ్యాధిః-విరహ-వియోగముచేతనైన-వ్యాధిః-మనోవ్యాధి- కథం-ఎట్లు-వర్తతే-ఉంచున్నది॥ ౨౩॥ టీక॥ భ్రూపల్లవం-భ్రూ-కనుబొమ్మలనెడి- పల్లవం- చిగుళ్లుగలిగిన-ధనుః-విల్లున్ను-అపాంగతరంగితాని-అపాంగ-కడకన్నులయొక్క-తరంగితాని- వీక్షణపరంపరలనెడి- బాణాః-బాణములున్ను- శ్రవణపాళిః - శ్రవణ - చెవులనెడి - పాళిః- చిహ్నముగలిగిన - గుణః-

తరంగితానిబాణాగుణ శ్రవణపాళిరితిస్మరేణ।తస్యాఘనంగజయజంగమదేవతాయామస్త్రాణినిర్జితజగంతికిమర్పితాని॥

ఇతిశ్రీకృష్ణదాసజయదేవకృతౌ గీతగోవిందేమహాకావ్యేతృతీయస్సర్గః.

౨౮॥శ్లో॥ యమునాతీరవానీరనికుంజేమందమాస్థితం।ప్రాహప్రేమభయోద్భ్రాంతంమాధవంరాధికాసఖీ॥

ఆష్టమాష్టపదీప్రారంభః.

౧ ॥ సౌరాష్ట్రరాగేణగీయతే ॥ నిందతిచందనమిందుకిరణమనువిందతిఖేదమధీరం-వ్యాళనిలయమిళనేనగరళమివకలయతిమలయసమీరం ॥ ప ॥ సావిరహేతవదీనాకృష్ణసావిరహేతవదీనా - మాధవమనసిజవిశిఖభయాదివ।భావనయాత్వయిలీనా ॥ సావిరహేతవ ॥ ౨ ॥ అవిరళనిపతితమదనశరాదివభవదవనా

---

అల్లెయున్న-ఇతి-ఈప్రకారముగా-స్మరేణ-మన్మథునిచేతను- నిర్జితజగంతి-నిర్జిత-జయింపబడిన-జగంతి- లోకములుగలిగిన- అస్త్రాణి- బాణములు-అనంగజయజంగమదేవతాయాం-అనంగ-మన్మథునియొక్క-జయ-జయసంబంధియైన-జంగమదేవతాయాం-సంచరణశీలదేవతారూపిణియైన-తస్యాం.ఆరాధయందు-అర్పితానికిం-ఉంచబడినవోఏమొ.

శ్రీగీతగోవిందమహాకావ్యటీకయందు-తృతీయస్సర్గ- సమాప్తంబాయెను.

౨౮ ॥టీ॥యమునా-యమునానదియొక్క-తీర- దరియందలి-వానీర-ప్రబ్బలిచెట్లయొక్క.నికుంజ-పొదరింటియందు- ఆస్థితం-ఉన్నట్టిన్ని- ప్రేమభయోద్భ్రాంతం- ప్రేమ-స్నేహముచేతనున్ను- భయ- పూర్వకృతాపరాధమువల్లగలిగినభయముచేతనున్ను-ఉద్భ్రాంతం-భ్రమసియున్నట్టి-మాధవం- శ్రీకృష్ణస్వామినిగూర్చి- రాధికాసఖీ-రాధికా-రాధయొక్క-సఖీ-చెలికత్తె-మందం-మెల్లగాను-ప్రాహ-పలికెను॥

యెనిమిదవ అష్టపది టీక.

౧॥ హేమాధవ-ఓశ్రీకృష్ణస్వామీ- మనసిజవిశిఖభయాదివ-మనసిజ-మన్మథునియొక్క-విశిఖ-బాణములవల్లనైన-భయాదివ- భయమువలనవలెనె-భావనయా-తలంపుచేతను-త్వయి-నీయందు-లీనా-అణగియున్న-సా-ఆరాధ-తవ- నీయొక్క-విరహే-వియోగమందు-దీనా-దీనురాలైనది-చందనం-శ్రీగంధమునున్ను-ఇందుకిరణం-చంద్రకిరణమునున్ను-నిందతి నిందింపుచున్నది-అధీరంధైన్యమానట్లుగాను- ఖేదం- దుఃఖమును-అనువిందతి-పొందుచున్నది-మలయసమీరం-మలయమారుతమును- వ్యాళనిలయమిళనేన-వ్యాళ-సర్పములయొక్క-నిలయ-స్థానముయొక్క-మిళనేన- కలయికచేతను- గరళమివ-విషమువలెనే-కలయతి-తలంచుచున్నది ॥ ౨॥టీక ॥ సా - ఆరాధ-అవిరళ-ఎడతెగనట్టుగాను-

